
సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజీ
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి
గురు వివేకానంద
గురు సాయి బాబా
గురు అరబిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళస్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

నన్ను "నేను" చేరుకోవటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్థం మహానుభావులైన **ద్వారకాదీష్ వాస్తు** వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన గ్రంధాలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) **ద్వారకాదీష్ వాస్తు** వారి వెబ్ సైట్: http://dwarkadheeshvastu.com
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం ఉచితంగా eBook రూపంలో **ద్వారకాదీష్ వాస్తు** వెబ్ సైట్ వారు అందించటం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు వారికి గలవు,కనుక వారిని సంప్రదించగలరు.

**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు *

ద్వారకాదీష్ వాస్తు వారి వెబ్ సైట్:

http://dwarkadheeshvastu.com



# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఓజసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# శ్రీగరుడ పురాణము

పరిచయము : గరుడ పురాణము అనగానే చాలమంది, అదేదో అశుభ పురాణమనియు, ఎవరో చనిపోయినప్పుడే తప్ప పదిరోజులలో చదువకూడదనియు ఒక దురభిప్రాయము లోకములో నాటుకొనిపోయినది. కానిఅదిసరియైనది కాదు. ఇది, విష్ణు మాహాత్మ్యమును దెలుపు వైష్ణవ పురాణము. నారదపురాణములో దీనిని గురించి - " మరీచే శృణు వచ్మ్యద్య పురాణం గారుడం శుభమ్. గరుడా యాబ్రవీత్ పృష్టో భగవాన్ గరుడాసనః "అని శుభమును గలిగించు పురాణముగా చెప్పబడినది.గారుడకల్పములో విశ్వాండము నుండి గరుడుడు జన్మించుటను, అతని చరిత్రమును, పురస్కరించుకొని ఈ గరుడ పురాణము వెలసెనని మత్స్య పురాణములో చెప్పబడినది. అగ్నిపురాణము వలెనే ఈ పురాణముగూడ విజ్ఞాన సర్వస్వమని చెప్పవచ్చును. దీనిలో అనేక విషయము లున్నవి అన్ని పురాణములలో వలెనే దీనిలోను బ్రహ్మాదుల సృష్టి, వారు చేసిన ప్రతిసృష్టి, వంశములు, మన్వంతరములు, వంశములలోని ప్రసిద్ధులైన రాజుల కథలు ఉన్నవి యుగధర్మములు, పూజా విధానములు, విష్ణుని దశావతారములు,అనేకధర్మములు, ఆయుర్వేదము,చికిత్సావిధానములు,ఛందశ్శాస్త్రప్రశంస,వ్యాకరణము, గీతాసారాంశముమొదలగునవిఅన్నియువర్ణింపబడినవి.ఈపురాణములో పూర్వఖండము ఉత్తరఖండము అని యున్నవి. ఉత్తరఖండములోని ప్రథమ భాగము ప్రేతకల్పము అని చెప్పబడును. చనిపోయిన వారి ఆత్మశాంతికై చేయదగిన కార్యము లన్నియు అందులో చెప్పబడినవి. కావున దానిని ఆ పదిరోజులలో చదువుట ఆచారముగా నున్నది. తక్కిన భాగము లన్నియు పవిత్రములే. అన్ని పురాణముల వలెనే ఎప్పుడు కావలసిన అప్పుడుఇంటిలోచదువుకొనుటకువీలుగానున్నవే.నైమిశారణ్యములో నిశౌనకాదిమునీంద్రులుసూతునడుగగా,వారికతడీగరుడపురాణము నిట్లు వినిపించెను.

## గరుడుని పుట్టుక

ఒక కల్పాంతప్రళయకాలములో లోకము లన్నియు నశించి జగమంతయు ఏకార్ణవ మైపోయెను. స్థావరములు లేవు. జంగమములు లేవు, సూర్యచంద్రులు లేరు, జగత్తులు లేవు, బ్రహ్మలేడు. అంతయు సర్వ శూన్యముగా నుండెను. అంతటను మహాంధకారము వ్యాపించి యుండెను. ఆ చీకటి కావల ఏదో ఒక మహాజ్యోతి. అది స్వయం ప్రకాశకమై వెలుగుచుండెను. అదియే సర్వ జగత్కారణమైన మహస్సు. ఆ జ్యోతిస్స్వరూపుడైన భగవానుని సంకల్పబలము వలన ఆ మహాజలనిధిలో ఒక పెద్ద అండము (గ్రుడ్డు) తేలుచుండెను. అది కొంతకాలమునకు చితికి రెండు చెక్క లయ్యెను.

ఒకటి నేలగాను, మరొకటి ఆకాశముగాను అయ్యెను. ఆ యండమునుండి గరుత్మంతుని రూపములోనారాయణుడావిర్భవించెను.అతనినాభికమలమునుండిబ్రహ్మఉదయించెను అతడేమిచేయవలెనోతోచకదిక్కులుచూచుచుండగా"తప,తప"అనుమాటలువినవచ్చెను అంతట నతడు చుట్టును చూడగా తనను సృష్టించిన గరుడ రూపుడైన నారాయణుడు కనిపించెను. ఆ మూర్తినే అతడు ధ్యానించుచు కొన్నివేల యేండ్లు తపము చేసి మానసిక శక్తిని సంపాదించెను. నారాయణు డతనిని సృష్టి చేయుమని యాదేశించెను.బ్రహ్మ మనస్సంకల్పముతోముందుసనకసనందనాదులనుసృజించగా వారు సంసారమునందు వైరాగ్యము గలవారై తపమునకు బోయిరి. అప్పుడు ఈ చరాచర సృష్టి చేయుట తన యొక్కని వల్ల సాధ్యముగాదని,దక్షమరీచి కశ్యపాది ప్రజాపతులను సృజించి, వారివారికి తగిన భార్యలను గూడ సృష్టించి యిచ్చి, మీరు సృష్టిని వ్యాపింపజేయుడని యాదేశించెను. వారు తమ తండ్రి యాజ్ఞను శిరసావహించి సృష్టిని కొనసాగించిరి.

కశ్యపపుత్రుడైన గరుత్మంతుడు

కశ్యపునికి చాలమంది భార్యలు గలరు. వారిలో వినత కద్రువ అనవారిద్దరు. వారిద్దరిలో కద్రువకు సవతి మచ్చరము హెచ్చు. కాని పతిని సేవించుటలో మాత్రము ఎవరి కెవరును తీసిపోరు. వినత సాధు స్వభావము గలది. ఆమె, గరుడ రూపుడైన శ్రీమన్నారాయణుడే సృష్టికి ఆదిపురుషుడని విని అటువంటి కుమారుడు కావలెనని శ్రీహరిని గురించి తపము చేసెను. నారాయణు డామె ననుగ్రహించి నీ గర్భమున గరుడుడుగా జన్మింతునని వరమిచ్చెను. ఆమె సంతోష భరితురాలయ్యెను.ఆమెకొన్నాళ్ళకు గర్భవతి యయ్యెను. ఒకనాడు కద్రూవినతలు క్షీరసాగరతీరమునకు విహారమునకు బోయిరి. అక్కడ ఉచ్చైశ్శ్రవము కనబడెను. దానిని జూచి కద్రువ "గుఱ్ఱము శరీర మంతయు తెలుపేకాని తో కమాత్రము నల్లగా నున్న"దనెను. వినత "అదేమి?అట్లనుచున్నావు?తోకకూడ తెల్లగా నున్నది కదా?"అనెను. కద్రువ, "కాదు నలుపే. నల్లగా నున్నచో నీవు నాకు దాస్యము చేయవలెను. తెల్లగా నున్నచో నేను నీకు దాస్యము చేసెదను"అనెను. వినత "అయినచో పోయి చూతము రమ్మ"నెను. కద్రువ "ఇప్పటికే సంధ్యాకాల మైనది. మన భర్తకు కావలసినవి చూడవద్దా? నడువుము. రేపు ప్రొద్దున చూత"మని చేయిపట్టి తీసికొనిపోయెను. ఆ రాత్రి తన కుమారులైన వాసుకి తక్షక ప్రముఖులైన సర్పరాజులను బిలిచి, "మీలో నల్లనివారు రేపు ఉదయమున ఉచ్చైశ్శ్రవము తోక పట్టుకొని వ్రేలాడుచు నల్లగా కనబడునట్లు చేయు"డనెను. "విషయ మే"మని వారడుగగా, జరిగినది చెప్పెను. వారిది అన్యాయ మనిరి. ఆ పని మేము చేయము అనిరి. ఆమె వారిని "సర్పయాగములో నశింపు"డని శపించినది.

ఆమె శాపమునకు భయపడి కొందరు తల్లి మాట చొప్పున చేయుటకు సిద్ధపడిరి. వాసుకి "నీవు అన్యాయముగా నిచ్చిన శాపము మాలో ధర్మపరులకు గాక ఇతరులకు వర్తించు"ననెను. మరునాడు కద్రువ వినతను దీసికొనిపోయి నల్లగా నున్న గుఱ్ఱపుతోకను దూరమునుండి చూపెను. వినత అమాయకురాలు. దాస్యము చేయుచుండెను. ఈ దాస్యము చేయుటకు అనూరుని శాపము కారణము. అదేమనగా : తన సవతి కద్రువకు సర్పసంతానము కలుగుచుండెను. తాను గర్భవతియై, వేయియేండ్లు గర్భభారమును మోసినను సంతానము కలుగ లేదను రోషముతో వినత గర్భమును బాదుకొనెను. అపుడు తొడలు, కాళ్ళు సరిగా ఏర్పడని అనూరుడు పుట్టెను. పుట్టుచునే అతడు, "నీ సవతి మీది మత్సరముతో నన్నిట్లు అంగవికలుని జేసితివి. కావున నీ సవతికి దాస్యము చేయు"మని శాప మిచ్చి, తాను సూర్యుని రథసారథిగా వెళ్ళుచు, నీ గర్భములో ఇంకొక కొడుకు ఉన్నాడు. వాడింకను వేయి యేండ్లకు పుట్టును. వాడు మహాబలవంతు డగును. వాడు జన్మించువరకును తొందర పడకుము. వాడే నీ దాస్యమును పోగొట్టు"నని చెప్పెను.వినతకు దాస్యములో నుండగానే గరుత్మంతుడు జన్మించెను. అతనిని గూడ కద్రువ దాసి కొడుకుగానే చూచెడిది. తన పిల్లలను (సర్పములను) వీపుమీద నెక్కించుకొని త్రిప్పి తీసుకొని రమ్మని యాజ్ఞాపించెడిది గరుడుడు వారి నెక్కించుకొని సూర్యమండలము దాక ఎగిరెడివాడు. వారు ఆ సూర్యుని వేడికి కమిలిపోయెడివారు. ఆరోజున పాపము గరుడునికి ఉపవాసమే. సవతి తల్లి కోపముతో తిండి పెట్టెడిది కాదు.ఒకనాడు గరుడుడు తన తల్లి దగ్గరకు బోయి, "మన కీ దురవస్థయే"మని ప్రశ్నించెను. ఆమె సర్వమును వినిపించెను. గరుడుడు కద్రువ దగ్గరకు వెళ్ళి "ఏ మిచ్చినచో నీవు నా తల్లిని దాస్య విముక్తురాలిని చేసెద"నని యడిగెను. ఆమె "దేవలోకము నుండి అమృతభాండమును దెచ్చి యిచ్చినచో నీ తల్లిని విడుతు"ననెను. గరుడుడు తండ్రియగు కశ్యపు నొద్దకు వెళ్ళి, తన తల్లి దాస్యమును, దాని విముక్తికి చేయవలసిన కార్యమును జెప్పి, ఇన్నాళ్ళును సరిదైన ఆహారము లేక కృశించియున్నాను. నాకు కడుపునిండ భోజనము పెట్టు"మని యడిగెను.కశ్యపుడు సముద్ర తీరమున విస్తరించుచున్న మ్లేచ్ఛజాతిని భక్షింపు మనగా గరుడు డట్లు చేసెను. వారిలో చెడిన బ్రాహ్మణుడొక డుండి గరుడుని గొంతులో అడ్డుపడెను. వాని కొఱకు ఆ మ్లేచ్ఛులను విడిచి పుచ్చెను. కశ్యపుడు గజకచ్ఛపములు పోరాడుచున్నవి, వానిని దిను మనగా ఆ రెండింటిని రెండు కాళ్ళతో పట్టుకొని పోవుచు ఎక్కడ పెట్టుకొని తినవలెనని వెదకుచు జంబూ వృక్షపు కొమ్మపై వ్రాలెను. అది విరిగెను. దానిపై వాలఖిల్యాది మునులు బొటన వ్రేలంత ప్రమాణము గలవా రుండి తపము చేసికొనుచుండిరి.

అది తెలిసికొని ఆ కొమ్మను ముక్కుతో పట్టుకొని పదిలముగా మేరు శిఖరముపై దింపి తాను మరొక వైపున గూర్చుండి గజకచ్ఛపములను భక్షించెను. ఆ తరువాత దేవలోకమునకు వెళ్ళి, అమృత కుంభమును దెచ్చుచుండగా రక్షకులు అడ్డగించిరి. వారిని గెలిచి వచ్చుచుండగా ఇంద్రుడు వచ్చి యెదిరించి పోరాడెను. కాని గరుడుని గెలువలేక వజ్రాయుధమును ప్రయోగించెను. అదికూడ అతనిని ఏమియు చేయలేకపోయెను. అప్పుడు ఇంద్రుడు గరుడునితో "దేవతలకు సర్వస్వమైన యీ యమృతమును పాములకు పోయుట మంచిది కాదు. నీ ప్రయత్నమును విరమింపు"మనెను. దానికి గరుడుడు "నా తల్లి దాస్యవిముక్తికై ఈ పనిచేయుచున్నాను. దీనిని నా సవతి తల్లికి ఇచ్చినచో నా తల్లి విముక్తురాలగును"అనెను. "ఐనచో నీవు దీనిని నీ సవతి తల్లి కిమ్ము. ఆమె, నీ తల్లికి గాస్యవిముక్తి రైయెనదని చెప్పగానే, అదృశ్యరూపుడనై వచ్చి ఈ యమృతకలశమును గొనిపోయెదను. దీనికి నీ వంగీకరింపు"మనెను. గరుడుడు ఒప్పుకొనెను. అమృత భాండమును కద్రువ చేతిలో బెట్టి, "మా తల్లికి దాస్య విముక్తి కలిసట్లే గదా! "అనగా ఆమె అవు ననెను. వెంటనే ఆమె చేతిలోని అమృతకలశము అదృశ్యమైపోయెను. అనగా ఇంద్రు డపహరించెను. ఈవిధముగా తల్లికి స్వాతంత్ర్యము కలిగించిన గరుడుడు తల్లి దీవెనలు పొంది తండ్రి దగ్గరకు వెళ్ళి విషయము నంతను వివరించెను. ఆయన తన కుమారుని పరాక్రమ విశేషములకు సంతోషించి, "కుమారా!ఆదిపురుషుడైన శ్రీమన్నారాయణుని గూర్చి తపము చేసి ఆయన యనుగ్రహము సంపాదింపుము. ధర్మవర్తనుడవై యుండుము. నీకు త్రిలోకము లందును ఎదురుండదు"అని చెప్పెను. తండ్రి హితబోధను విని గరుడుడు శ్రీహరిని గూర్చి తీవ్రమైన తపము చేసెను. చాలకాలము అట్లు చేయా శ్రీనాథుడు ప్రత్యక్షమై "గరుడా!నీ భక్తికి మెచ్చినాను. నీవు నాకు వాహనమై యుండి నేను చెప్పిన పనులు నిర్వర్తింపుచుండుము"అని వర మిచ్చి తనకు వాహనముగా జేసికొనెను.

## గరుడుని గర్వభంగము

ఒకప్పుడుగరుత్మంతునికి,తానుమహాబలవంతుడననిగర్వముకలిగెను. తాను తక్కువవాడా? గజకచ్ఛపములను చెరియొక కాలితో పట్టుకొని కొన్నియోజనముల దూరము ఎగురుట, అంతమంది రక్షకులనుగెలిచి దేవలోకమున నున్న అమృతమును దెచ్చుట, ఇంద్రుని వజ్రాయుధమునకుబెదరకుండుటసామాన్యవిషయములా?అవన్నియుఎందుకు? సకలబ్రహ్మాండభాండములనుతనకడుపులోబెట్టుకొన్నఆశ్రీమహావిష్ణువును అనాయాసముగా వహించుచు లోకము లన్నియు దిరుగుచున్న తనకంటె బలవంతుడీ చతుర్దశ భువనములలో

ఇంకెవ డున్నాడని గర్వపడసాగెను. దానితో అందరిని కొంత చులకనగా జూచుచు ప్రవర్తింప జొచ్చెను. ఇది నారాయణుని దృష్టిలో బడినది. ఇతని కెట్లయినను గర్వభంగము చేయవలెనని సంకల్పించెను. ఒకనాడు నారదాది మునులు శ్రీపతిని దర్శించుటకై వచ్చిరి. విష్ణుమూర్తి వారితో మాటలాడుచు అలవోకగా ప్రక్కనున్న గరుడునిపై చేయివేసెను. మునులతో మాధవుని సంభాషణ సాగుచుండెను. గరుడునికి విష్ణుమూర్తి చేయి భరింపలే నంత బరువుగా నుండెను. ప్రాణములు కడబట్టుచుండెను. సంభాషణ ఎంతసేపు సాగినదో కాని గరుడు డీలోపున ప్రాణావశిష్టు డయ్యెను. ఎప్పటికో మునులు సెలవు దీసికొని వెళ్ళిరి. శ్రీహరి అప్పుడా చేయి గరుడుని మీదనుండి తీసెను. గరుడు డప్పటికే సొమ్మసిల్లి పడిపోయెను. శ్రీహరి అతనిని మృదువుగా స్పృశించెను. గరుడు డా స్పర్శతో తేరుకొని, విష్ణుమూర్తి పాదములపై బడి, "ఓ మహాపురుషుడా!నీ కన్న సృష్టిలో అధికు లెవ్వరును లేరు. ఈ పరమార్థమును గ్రహింపలేక గర్వాంధుడనైన నాకు సరియైన పాఠమును జెప్పితివి. నా యపరాధమును మన్నింపు"మని వేడుకొనెను. శ్రీహరి ప్రసన్ను డయ్యెను.

## నవగ్రహములు - రత్నములు

సూర్యాది నవగ్రహములకును తొమ్మిది విధములైన రత్నములు నిర్దేశింపబడినవి. ఆకాశములో నున్న ఈ గ్రహముల కాంతులు సరిగా మనపై ప్రసరింపకపోవచ్చును. ఆ కాంతులు మన శరీరముపై బడినచో అనేక అనారోగ్యములు తొలగుటయేకాక, ఆయా గ్రహములు విషమస్థానములందున్నచో సత్ఫలితములను, మంచి స్థానములందున్నచో విశేషఫలములను కలిగించును. అందుచేత నవరత్నాల ఉంగరములను ధరించుట నవగ్రహ ప్రీతి కొరకే అని గ్రహింపవలెను. ఆయా గ్రహములకు చెప్పబడిన రత్నములు క్రింద నీయబడుచున్నవి.

1. సూర్యుడు - పద్మరాగము - (కెంపు)
2. చంద్రుడు - ముత్యము
3. అంగారకుడు - పగడము
4. బుధుడు - ఆకుపచ్చ
5. గురుడు - పుష్యరాగము (గరుడపచ్చ)
6. శుక్రుడు - వజ్రము
7. శని - నీలము (ఇంద్రనీలము)
8. రాహువు - గోమేధికము
9. కేతువు - వైడూర్యము

పంచ మహాయజ్ఞములు

"యజఆరాధనే",అనుధాతువునుండిపుట్టినదియజ్ఞశబ్దము.పృథ్వివిలో పుట్టిన ప్రతిమానవుడును ప్రతిదినమును ఈ యజ్ఞము లాచరించవలెను. ఈయజ్ఞము లైదు. 1. దేవయజ్ఞము 2 పితృయజ్ఞము 3. భూతయజ్ఞము 4. మనుష్యయజ్ఞము 5. బ్రహ్మయజ్ఞము.

1. దేవయజ్ఞము : దీనినే వైశ్వదేవ మందురు. గృహస్థులు గార్హాపత్యాగ్నిలో దేవతల నుద్దేశించి చేయుదురు. బ్రహ్మచారులైనచోలౌకికమైనఅగ్నిలేనే అగ్నికార్యము చేయుదురు. (గృహస్థులు చేయునది మాత్రమే వైశ్వదేవము.) శూద్రులకు నమస్కారమే దేవయజ్ఞ ఫలము నిచ్చును.

2. పితృయజ్ఞము : ఇది తల్లిదండ్రులు లేనివారు చేయునది. పితృవర్గమును, మాతృవర్గమును చెప్పుచుస్వధాకారముతోజలముతోగాని,తిలలు గలిపిన జలముతోగాని తర్పణము చేయుటే పితృయజ్ఞము.తండ్రి లేని వానికే తర్పణము చేయు అధికార ముండును. తండ్రి జీవించి యున్నపుడు తల్లి లేనివానికి గూడ తర్పణము చేయు అధికారము లేదని కొందరి మతము.

3. భూతయజ్ఞము : గృహస్థుడు తాను భోజనము చేయుటకు ముందు ఇంటి పరిసరములలో దిరుగు కాకులకు ఇతర జంతువులకును ఆహారము పెట్టుటయే భూతబలి. ఇది యెవ్వ రైనను భూతదయ గలవారు చేయవచ్చును.

4. మనుష్యయజ్ఞము : ఇంటికి వచ్చిన అతిథులను అభ్యాగతులను సత్కరించి భోజనము పెట్టుట, లేదా సామూహిక సమారాధనలు (అన్నదానములు) జరుగునపుడు యథాశక్తిగా ధనమునుగాని వస్తుసంభారములనుగాని యిచ్చి సహకరించుట.

5. బ్రహ్మయజ్ఞము : ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వణవేదము అను నాలుగింటిలో, తమ శాఖకు చెందిన వేదభాగమును అధ్యయనము చేయుట, లేదా! అధ్యయనము చేసిన దానిని పునశ్చరణము చేయుట బ్రహ్మయజ్ఞ మనబడును.

శూద్రాదివర్ణములవారు బ్రహ్మజ్ఞానులైన ఋషులు రచించిన పురాణములను ధర్మశాస్త్రములను చదువుట లేక వినుట బ్రహ్మయజ్ఞ మగను.

బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు ప్రతిదినము ఉదయమునను, మధ్యాహ్నమునను, సాయంకాలమునను మంత్రయుక్తముగా సంధ్యోపాసనము చేయవలెను. "అహరహ స్సంధ్యా ముపాసీత"అని పెద్దల యాదేశము.

శూద్రాదివర్ణములవారు ఉదయముననే స్నానము చేసి జగత్కర్మసాక్షియైన సూర్యునికి నమస్కారము చేసి ధ్యానించినచో అది సంధ్యావందన మగును. సాయంకాలము గూడ ఇట్లే చేయవలెను.

## దానములు - ధర్మములు

దానములు వేరు, ధర్మములు వేరు. దాన మనగా ఇచ్చెడి వస్తువునందు మమత్వమును విడిచి ఇతరుల కిచ్చునది. ధర్మ మనగా ప్రజోపయోగార్థమై చేయు ఇష్టాపూర్తరూపమైనది దిగుడు బావులు, మంచినీటి నూతులు చెఱువులు త్రవ్వించుట, దేవాలయనిర్మాణము, ఉద్యాపనములు, పండ్లతోటలు నాటించుట మొదలగు కార్యములు ధర్మములోనికి వచ్చును. అగ్నిహోత్రము, తపస్సు, సత్యవ్రతము, వేదాధ్యయనము, అతిథిమర్యాద, వైశ్వదేవము ఇట్టివానిని ఇష్టము లందురు. సూర్య, చంద్రగ్రహణ సమయములలో ఇచ్చు దానము వలన దాత స్వర్గాదిపుణ్యలోకములను బొందును. దేశమును, కాలమును, పాత్రతను (యోగ్యతను) గమనించి యిచ్చిన దానము కోటి గుణిత మగును. కర్కాటక, మకర సంక్రమణములందును అమా,పూర్ణిమాది పర్వములందును చేసెడిదానము విశేష ఫలమునిచ్చును. దాతతూర్పుముఖముగాకూర్చుండిసంకల్పము,గోత్రనామములతోజెప్పి దాన మీయవలెను. పుచ్చుకొనువాడు ఉత్తరాభిముఖుడై స్వీకరింపవలెను.అట్లు చేసినచో దాతకు ఆయుర్దాయము పెరుగును. గ్రహీతకు పుచ్చుకొన్నది అక్షయ మగును. మహాదానములు పది

శ్లో॥ కనకాశ్వతిలానాగా దాసీరథ మహీగృహాః,
కన్యాచ కపిలా ధేనుః మహాదానాని వై దశ॥

తా. బంగారము, గుఱ్ఱము, తిలలు, ఏనుగులు, దాసీజనము, రథములు, భూమి, గృహములు, కన్యక నల్లని ధేనువు వీనిని మహాదానము లనిరి. ఇవి పది.దేవతలకుగాని, బ్రాహ్మణులకుగాని, గురువులకుగాని, తల్లిదండ్రులకు గాని ఇచ్చెదనని వాగ్దానము చేసిన దానిని ఇయ్యక ఎగగొట్టినచో వంశనాశనము జరుగును. ప్రతిగ్రహీతనుండి ఏదో లాభము నాశించి దాన మిచ్చినచో అది నిష్ప్రయోజన మగును. ప్రతిగ్రహీత నుద్దేశించి దానము చేయుచు, ఆ దానధారను భూమిపై విడిచినచో ఆ దానఫలము మహాసాగరముకన్న అనంతమైనది యగును. గౌతమీ, గంగా, గయా, ప్రయాగాది తీర్థములం దిట్టి దానములు విశేష ఫలముల నిచ్చును.

## వైవస్వత మన్వంతరములోని వ్యాసులు

ఇప్పుడు జరుగుచున్నది వైవస్వతమన్వంతరములో ఇరువది యెనిమిదవ మహాయుగము. అందులోను కలియుగము. వ్యాసుడు జన్మించి వేదాలు నాలుగుగా విభజించి, పదునెనిమిది పురాణములు రచించినది, దీనికి వెనుక ద్వాపరయుగములోనే. గతించిన యిరువది యేడు మహాయుగములలోను ద్వాపరములందు ఇరువది యేడుగురు వ్యాసులు జనియించిరి.ప్రతి కలియుగములోనుమానవుల శక్తి సామర్థ్యములుపూర్వయుగములలోకంటె అల్పముగా నుండును.

వారు అనంతములైన వేదములను అధ్యయనము చేయలేరు. అందు నిక్షిప్తమైన నిగూఢ ధర్మములను గ్రహించి ఆచరింపలేరు. అందుచేత ప్రతి మహాయుగములోను ఒక వ్యాసుడు జనించి ఆ వేదరాశిని ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వణ వేదము అను నాలుగు విభాగములు చేసి ఒక్కొక్క శాఖను కొన్ని వంశముల బ్రాహ్మణ క్షత్రియ వైశ్య వర్ణముల వారు అధ్యయనము చేయవలెనని నియమించినారు. అంతేకాదు:ఆ వేదాలలోని ధర్మములను బోధించుటకైపదునెనిమిది పురాణములును, పదునెనిమిది ఉపపురాణములును వెలసినవి.గతించిన ఇరువది యేడు ద్వాపరయుగములలోను జన్మించిన వ్యాసులు వీరు :

మొదటి మహాయుగమున ద్వాపరములోని వ్యాసుడు స్వాయంభువ మనువు

రెండవ ద్వాపరములో ప్రజాపతి

మూడవ ద్వాపరములో ఉశనసుడు

నాలుగవ ద్వాపరములో బృహస్పతి

ఐదవ ద్వాపరములో సవిత్రుడు

ఆరవ ద్వాపరములో మృత్యువు

ఏడవ ద్వాపరములో ఇంద్రుడు

ఎనిమిదవ ద్వాపరములో వసిష్ఠుడు

తొమ్మిదవ ద్వాపరములో సారస్వతుడు

పదవ ద్వాపరములో త్రిధాముడు

పదునొకండవ ద్వాపరములో త్రివృషుడు

పండ్రెండవ ద్వాపరములో శతతేజుడు

పదుమూడవ ద్వాపరములో ధర్ముడు

పదునాలుగవ ద్వాపరములో తరక్షుడు

పదునైదవ ద్వాపరములో త్ర్యారుణి

పదునారవ ద్వాపరములో ధనంజయుడు

పదునేడవ ద్వాపరములో కృతంజయుడు

పదునెనిమిదవ ద్వాపరములో ఋతంజయుడు

పందొమ్మిదవ ద్వాపరములో భరద్వాజుడు

ఇరువదవ ద్వాపరములో గౌతముడు

ఇరువదొక్కటవ ద్వాపరములో రాజశ్రవుడు

ఇరువది రెండవ ద్వాపరములో శుష్మాయణుడు

ఇరువది మూడవ ద్వాపరములో తృణబిందుడు

ఇరువది నాలుగవ ద్వాపరములో వాల్మీకి

ఇరువది యైదవ ద్వాపరములో శక్తి

ఇరువది యారవ ద్వాపరములో పరాశరుడు

ఇరువది యేడవ ద్వాపరములో జాతూకర్ణుడు

ఇరువది యెనిమిదవ ద్వాపరములో కృష్ణద్వైపాయనుడు.

ఈ కృష్ణ ద్వైపాయనుడు బ్రహ్మశాసనము మీద వేదములను నాలుగుగా విభజించి పైల జైమిని, సుమంతు, వైశంపాయను లను శిష్యులకు బోధించి, అష్టాదశ పురాణములన రచించి రోమహర్షణునకు (సూతునికి) బోధించి లోకములో వ్యాపింపజేసెను.

శ్రీహరి దశావతారములు

## 1. మత్స్యావతారము

వైవస్వతమను వొకనాడు నదిలో సూర్యునికి అర్ఘ్య మిచ్చుచుండగా ఒక చేపపిల్ల అతని చేతిలో బడెను. అది పెరిగి పెద్దదగుచుండగా గంగాళములోను, చెరువులోను, సరస్సులోన వేసెను. ఇంకను పెరుగగా సముద్రములో వేసెను. అప్పుడా చేప మనువుతో "ప్రళయ కాలమునఒకనావవచ్చును.దానిలోసప్తమహర్షులనునీవునుఎక్కికూర్చుండుడు.ప్రళయాంతమ వరకును ఆ నావను మహాసముద్రములో నా కొమ్మునకు గట్టుకొని లాగుకొని పోవుచునె యుందు"నని చెప్పెను. మను వట్లే చేసి ఆ ప్రళయమును దాటెను. మరల బ్రహ్మసృష్టిచె యుటకుపూనుకొన్నపుడుహయగ్రీవుడనురాక్షసుడు(ఇతనినేసోమకాసురుడనికూడ అందురు) వేదములనపహరించిసముద్రములోదాగియుండగాశ్రీమన్నారాయణుడుమత్స్యావతారమును మరల ధరించి, వానిని సంహరించి వేదములను మరల బ్రహ్మ దగ్గరకు చేర్చెను.

## 2. కూర్మావతారము

దూర్వాసుని శాపముచే ఇంద్రుని సంపద లన్నియు సముద్రములో గలిసిపోగా, విష్ణుమూర్తి సలహామీద దేవ దానవులు సముద్రమును మథించిరి.ఈ పాల సముద్రమును మథించుట కారంభించినపుడు కవ్వముగా వేసిన మందరపర్వతము మునిగిపోసాగెను. అప్పుడు నారాయణుడు కూర్మావతారమును ధరించి దాని క్రింద ఆధారముగా నిలువబడెను. దానితో సముద్ర మథనము జరిగి సర్వవస్తువులును, అమృతమును పుట్టెను.

## 3. వరాహావతారము

హిరణ్యాక్షుడు దేవతలను గెలిచి స్వర్గ మాక్రమించినప్పు డతనిని యజ్ఞవరాహ రూపముతో సంహరించెను.

4. నృసింహావతారము

అతని సోదరుడు హిరణ్యకశిపుడు తరువాత దేవలోకము నాక్రమించి యజ్ఞభాగములను కాజే యగా నారసింహరూపము ధరించి అతనిని సంహరించెను.

5. వామనావతారము

బలిచక్రవర్తి యింద్రుడై దేవతలను స్వర్గమునుండి తరిమివేయగా శ్రీహరి వామనుడై పుట్టి బలిని మూడడుగుల నేల యడిగి, వామనుడు అవామనుడై రెండడుగులలో భూమ్యాకాశముల నాక్రమించి అతనిని పాతాళమునకు త్రొక్కివేసెను.

6. పరశురాముడు

శ్రీహరి తన అంశముతో జమదగ్నికి పరశురాముడై పుట్టి మదాంధులైన రాజులను ఇరువదియొక్క సారులు దండయాత్రలు చేసి సంహరించెను. చివరకి దశరథ రాముని చేతిలో ఓడి తపమునకు బోయెను.

7. శ్రీరాముడు

రావణకుంభకర్ణులను సంహరించుటకై దేవతలు ప్రార్థించిన మీదట దశరథునకు రామునిగా పుట్టి, సీతను పెండ్లాడి, సీతాలక్ష్మణులతో అరణ్యవాసము చేసి అనేక రాక్షసులను వధించెను రావణుడు సీత నెత్తికొని పోగా సుగ్రీవుని సహాయముతో లంకకు వెళ్ళి రావణకుంభకర్ణాది రాక్షసులను సంహరించి, అయోధ్యకు వచ్చి పట్టము గట్టుకొనెను. లోకాపవాదమునకు భయపడి సీతను అడవిలో వదలగా ఆమె వాల్మీకి ఆశ్రమమునకు జేరెను. అప్పటికే గర్భవతియైన సీత, అక్కడ కుశలవులను ఇద్దరు కొడుకులను గనెను. రాముడు పదునొక్క వే ల యేండ్లు రాజ్యము చేసి కుశునికి పట్టాభిషేకము చేసి, సీతా సమేతుడై అయోధ్యాపురవాసులతో సహా పరమపదమునకు వేంచేసెను.

8. శ్రీకృష్ణావతారము

ఇరువది యెనిమిదవ ద్వాపరయుగములో అధర్మప్రవృత్తులైన రాజుల వలన భూభారము పెరిగినప్పుడుభూదేవికోరికపైశ్రీహరి,కృష్ణావతారమునెత్తెను.దేవకీవసుదేవులకుఅష్టమగర్భమున జన్మించి, వ్రేపల్లెలో నందయశోదల యింట పెరిగి బాల్యక్రీడలచే వారిని అలరించి, దుష్ట రాక్షసులను సంహరించెను.మధురాపురమునకు బోయి కంసుని సంహరించి, మాతామహుని రాజ్యమున నిలిపి, బలరామునితో గలిసి శత్రువులను నిర్మూలించెను. రుక్మిణ్యాది అష్టమహిషులను వివాహమాడెను.నరకుని జంపి 16000 మందిని వాని చెరనుండి విడిపించి పెండ్లాడెను. ద్వారకా నగరమును నిర్మించి భార్యాపుత్రబంధుమిత్ర పరివారముతో నూటపాతిక యేండ్లు భూలోకమున నివసించెను.

భారత యుద్ధములో పాండవుల పక్షమున నుండి అధర్మపరులను నాశనము చేసెను
తరువాత యాదవులు మదించి అధర్మముగా ప్రవర్తించుచుండగా ముసలము వంకతో
వారినిగూడ సంహరించి తాను పరమపదమునకు చేరెను.

9. బుద్ధావతారము

ఒకప్పుడు రాక్షసులు విజృంభించి దేవలోకముపై దండెత్తి దేవతల నోడించి తరిమివేసిరి
దేవతలు ప్రార్థింపగా మాధవుడు, మాయామోహ స్వరూపముతో శుద్ధోదనుని కుమారుడుగా
జన్మించెను. వేదవిరుద్ధములైన బోధలతో రాక్షసుల నందరను సమ్మోహపఱచి వారిని వే
దబాహ్యులను జేసెను. ఒక్క రాక్షసులనే కాక భూలోక వాసులను గూడ భ్రమింపజేసెను
రాక్షసులు పాషండులై బలమును తేజమును కోల్పోయిరి. అప్పుడు దేవతలు వారినోడించి
స్వర్గమును చేజిక్కించుకొనిరి.

10. కల్క్యవతారము

బుద్ధుని బోధనల ప్రభావము భూలోకమున రాజులపై ప్రసరించును. వారధర్మపరులై
ప్రజాకంటకులై ప్రవర్తింతురు. ప్రజలు కూడ అన్యాయ ప్రవర్తనులై వేదకర్మల నాచరింపక
యుందురు. అప్పుడు కలియుగములో విష్ణుయశుడను వానికి శ్రీహరి, కల్కిరూపముతో
జన్మించును. ధర్మమును తిరిగి ప్రతిష్ఠించును. ఈ దశావతారముల కథను విన్నవారికి
అనంతమైన పుణ్యము గలుగును.

శ్రీమన్నారాయణు డింకను ఎన్నో అవతారము లెత్తెను. అవియన్నియు ధర్మసంస్థాపనము
చేయుటకే యని గ్రహింపవలెను.